శ్రీరస్తు.

# భద్రాద్రి సీతారామశతకము.

శ్రీకల్యాణ గుణాకర
నాకేంద్ర ముఖార్చితాంఘ్రి నళినద్వంద్వా
నీకిదె మ్రొక్కెద బ్రోవుము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 1

నీకారుణ్యము నందగ
లోకేశ్వర నిన్ను జూడ లోదలచెదవే
నాకోరిక లిడి బ్రోవుము
శ్రీకర భద్రాద్రిధామ సీతా రామా. 2

నీకంటె మేలుదైవము
నాకెవ్వరు లేరు వెదుక నమ్మిన భక్తున్
చేకొని రక్షింపంగదె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 3

క. వాకొనుచుంటిని మొరవిను
నాకొక గడ్డయ్యె తోడన నళినాక్ష మహా
కాక యిటుచుండె గావవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 4

క. యేకరణియోర్తు బాధకు
నాకెవ్వరు దిక్కు నీవ నయముగు నటులగ
నీకృప జూపింపంగదె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 5

క. కాకుత్థ్సవంశ జలనిధి
రాకాకుముదాప్తసకల రాక్షసహర సు
శ్లోక నిజసేవకావన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 6

క. ఏకోనారాయణుడని
లోకంబులు సకల మౌని లోకంబులు ని
న్నేకాలము భజియించును
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 7

క. కైకపనుప నెడి నెపమున
లోకంబులు గష్టపెట్టు లుబ్ధుల దనుజా
నీకమడచి తడవికిజని
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 8

క. ఆకలి యగుచున్నవనిన్
లేకున్నవె పండ్లు శబరి నిన్ రక్షింపన్
జేకొంటి దాని యెంగిలి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 9

క. కాకాసురుండు చంచున
నీకామిని కుచము బొడువ నెమ్మిని వానిన్
బోకార్పక నేలితివహా
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 10

క. భీకరమై నెరెత్తని
శ్రీకంఠుని విల్లువిరచి సీతాదేవిన్
జేకొంటివి చిన్నప్పుడ
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 11

క. కోకలు పచ్చడములు న
స్తోకవిభూషావళులును సొరిదినడుగ నే
నీకరుణ గోరువాడను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 12

క. మీకల్యాణ మహోత్సవ
మేకాలము మద్గృహమున నిర్జరుగన్
బ్రాకటముగ గరుణింపుము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 13

క. మీకాలిదుమ్ము సోకెను
సోకిన శాపంబుబాసి సుదతియయి యహ
ల్యాకాంత లేచె నద్దిర
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 14

క. శ్రీ కామినియై తగు సీ
తాకాంతామణిని గూడి తమ్ములతో నీ
వేకాలముండు మీహృది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 15

వాకున కందక జూడగ
రాకుండెను నీదు రూపు రఘుతిలక దయన్
నాకుం జూపింపంగదె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 16

సాకల్యంబుగ మీదగు
ప్రాకటవైభవముగంటి భవ్యుడనైతిన్
నా కానందము గలిగెను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 17

ఆకార రహితుడవు
విమలాకారుడ వచ్యుతుండ వచలుండ వహో
లోకారాధ్యుడ వీవే
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 18

ఆకలి దప్పియు బడలిక
వేకియు జరలంటనట్టి విద్యల నీవే
గైకొనుట చిత్రమయ్యెడి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 19

క. కూకటులతోడ రాముని
పాకారిని వెంటనంటి పాపాసురులన్
జోకార్చి సవనమేలితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 20

క. నీ కడిమికి నచ్చెరువడి
కైకొన భార్గవుడు వాని క్రియతని వి
త్రైకకొని యడగించితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 21

క. రాకా నిశాకరునిగతి
నేకోరెదు కలువలట్లు నే నెప్పుడు నీ
రాకను గనగోరెద మది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 22

క. నాకాధిప నందను నొక
భీకర బాణమున దృంచి వేరవిజునకున్
యా కపిరాజ్య మొసగితివి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 23

క. రాకలుషంబులు వెడలుప
మాకట్టును మరలనీక మహితలకయి మో
క్షాకరమగు నీనామము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 24

క. పాకారి భోగమబ్బిన
లేకుండును దృప్తిమదికి లేశంబును నీ
యాకార మహిమ జూపవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 25

క. నీ కామిని సిరులిచ్చును
నీకొడుకు జగంబులెల్ల నిర్మించు నహో
నీకాపురంబె లోకము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 26

క. ఆకాశంబది త్రివిధం
బాకరణిని మూడువిధములైతివి నీవే
సాకారు నిన్ను గొలిచెద
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 27

క. నా కలుష భవాబ్ధిని మో
దాకర దాటంగ యుష్మదంఘ్రి స్తోత్రం
బేకలము నిశ్చయంబుగ
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 28

క. చీకునకు రాత్రియును ప్ర
భాకర యుతమైన పట్టపగలును నొకటే
మీకరుణ లేక మాకిల
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 29

క. రాకట పోకటగల యీ
ప్రాకృతమగు భవమదేల భవదాకృతిలో
నే కలుపుకొమ్ము చివరకు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 30

క. ఓ కమలాప్త కులోత్తమ
సాకల్యంబుగను నీదు సద్రూపంబున్
నాకుం జూపంగదవే
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 31

క. రూకలు నాలుగు వక్రపు
పోకడలన్ సంతరించి భువిజనులకు బ
ల్కాకలిడు వారి నడపవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 32

క. వాకలు సంద్రమునంబడు
పోకడగా నెల్లవేలు పులకిడు మ్రొక్కల్
నీకే జెందు నిజంబిది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 33

క. సాకగవలె నీ భక్తుడ
వేకష్టములెల్ల దీర్చి ప్రేమను నీవే
నాకుం దల్లివి దండ్రివి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 34

క. భీకరులై యప్పులవా
రేకష్టము లిడుదురొక్కొ యికనన్నాపల్
గాకులలో బడనీకుము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 35

క. సోకుగమి ప్రబలిదేవా
నీకంబున బాధపెట్ట నిజముగవారిన్
పోకార్ప నవతరించితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 36

క. ఏకతమున నటవృక్షపు
ఆకున బాలుండవగుచు నసుఖుడవై
యేకార్ణవమున పండెదు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 37

క. కాకివలె సంచరించెడి
నేకాలము నిలువదొకట యిటె నామది నీ
వేకట్టడి యిడవలెజుమి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 38

క. రాకేందువదన యొక్కతె
చేకొని శ్రీరామయనుచు చిలుకను బిలువం
గా కైవల్య మొసంగితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 39

క. మీంక ఘన తయు మును
వాల్మీకుడు విరచించిగాదె మేదిని పుణ్య
శ్లోకుండయ్యె నతండును
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 40

క. మాకందఫలము మధురర
సాకరమగునట్లు యుష్మదాఖ్యామృతమున్
మాకందంబగు చుండును
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 41

క. ఆ కమలజు నిగమములన్
జేకొని సంద్రింబుజొచ్చు చెడుసోమకుమ
త్స్యాకారమ్మున గూల్చితి
శ్రీకరభద్రాద్రిధామ సీతారామా. 42

క. సోకులు వేల్పులు వడి క్షీ
రాకరమును తఱచువేళ నల మందరముఁ
శ్రీకూర్మముమవై మోచితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 43

క. సూకర రూపముదాలిచి
భీకరుడగు హేమనేత్రు పీచమడచి నీ
వే కదగాచితి జగములు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 44

క. ఈ కంబమునం జూపుము
కాకవిపక్షునన హేమకశిపుని నరసిం
హాకారమున వధించితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 45

క. నాకాధిపత్య మూదిగ
లోకములన్నియును దాని లోగొను బలినిన్
పోకార్చితి గుజ్జుడవై
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 46

క. ఆకార్తవీర్యకతమున
లోకంబున గలుగు రాజలోకము నెల్లన్
వీకనడంచితి పరశువు
చేకొని భద్రాద్రిధామ సీతారామా. 47

౬. ఆ కమలజువరమున సుర
భీకరుడై రావణుండు వేధింపగ నీ
కాకుత్థ్సుడవై గూల్చితి
శ్రీకరభద్రాద్రిధామ సీతారామా. 48

౯. ఆకట్టికి నెచ్చెలివై
భూకామిని భారమెల్ల బోగొట్టుటకై
శ్రీకృష్ణుడ వైతివిగద
శ్రీకరభద్రాద్రిధామ సీతారామా. 49

. ఈకలివేళను బుద్ధుడ
వై కలధర్మముల నెల్ల బహుళపరచి యొం
తో కారుణ్యత నేలితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 50

. వాకులలోపల తప్పులు
బోకుండునె వానిసైచి బ్రోవవగు మీ
నాకర గర్వ విభంజన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 51

క. వైకుంఠము భద్రాచల
మాకమలాక్షుండవీవ యవనిజ లక్ష్మి
లోకేశ్వరి నిశ్చయముగ
శ్రీకర భద్రాద్రిరామ సీతారామా. 52

క. వేకువజామున మేల్కని
వాకకు జని తానమాడి వడి తవపూజా
నీకంబులు నడుపగవలె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 53

క. నేకాపురుషుడ నంచు వి
లోకింపక నుంటదగునె లోకములోనన్
నాకంటె హీనుగావవె
శ్రీకరభద్రాద్రిధామ సీతారామా. 54

క. రాకుండునె సిరియుండిన
కాకుండునె కాగలట్టి కార్యములెల్లన్
మీకరుణ బడయుగావలె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 55

క. శ్రీక ... మీ నామం
బేకళనపు నీమమూని యెల్లప్పుడు న
స్తోక మనీష జపింపడె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 56

క. కేకీసంఘము మేఘవి
లోకనమున సుఖముగాంచు లో నెప్పుడటుల్
నాకబ్బుముదము మిముగన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 57

క. నీకథలు జెప్పుదాసు ల
నేకులు ధనవంతులైరి నీప్రాపకమే
జేకూర్చు నఖిలసుఖములు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 58

. మోకాలు నడ్డపెట్టిన
ప్రాకటముగ లక్ష్మి దాను రాదలచినచో
రాకుండునె వగ పేటికి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 59

క. కోకల నూడ్చిన ద్రౌపది
వ్యాకులపడి నిన్ను వేడ నక్షయపలువల్
రాకాబ్జముఖికి నొసగవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 60

క. రూకలకై మనుజులు పలు
పోకలుబోవంగనేల పూర్వభవమునం
దాకర్మఫలము గుడుపదె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 61

క. ఏకఠనదపము దశరథ
భూకాంతుడు కోసలేంద్ర పుత్రీమణియున్
జేకొని జేసిరో నినుగన
శ్రీకర భద్రాద్రిరామ సీతారామా. 62

క. కాకని కాకవియనుచు వి
వేకంబోకయింత లేక వ్రేలెదరిల దా
రేకవులో దలిచిచూడగ
శ్రీకర భద్రాద్రిరామ సీతారామా. 63

క. నాకవితలోనదప్పుల
నేకంబులుగలవెయైన నీకృతిగద శో
భాకరమగునని దలచెద
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 64

క. కాకోదరారివాహన
కాకోదరశయన దళితకాకోదరయా
కాకోదరభూషణనుత
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 65

క. రాకేందుముఖము తామర
రేకులనేత్రముల బాల్యరీతులతోడన్
నాకడ నృత్యముజేయవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 66

క. నాకంబున కరుగక మీ
రాకకు శరభంగుడుండి పరివిమలభక్తిన్
నీకళగని తరియించెను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 67

క. మీ కాపాడిన రాజ్యము
శ్రీకరమై పక్షులకును సేమమొగూర్చెక్
ఘూకమ్ము గ్రద్ధకథవిన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 68

క. ఓకమలాధిప రార
మ్మా కావగనంచు వేడ మకరిన డచి ము
న్నా కరి నేలవె ప్రేమను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 69

క. ఆకుంబరాళి చిగిర్చిన
మాకులు శోభించునటుల మహినీభక్తా
నీకము దివ్యాకృతిగను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 70

క. తేకువ ప్రతియామమునకు
కోకోయని కూయునట్టి కోడివిధముగా
నేకాగ్రత గనవలె మది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 71

క. తోకలజుక్కలు బుట్టను
భూకంపములొదవు జగము బొందుభయంబుల్
నీకరుణ దప్పినేనియు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 72

క. ఏకర్మాచరణంబున
జేకూరు శుభోన్నతులును స్థిరతరముగ నా
కాకర్మము లొనగూర్పవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 73

క. ఆ కుచేలుండు పిడికెం
డేకద యటుకులనొసంగె యేమన నతడ
స్తోకవిభవంబులందడె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 74

క. రాకొమరుడు ధృవు డైదేం
డ్లే కలిగియు నినుభజింప ఎలమిధృవపదం
బా కంజార్కమొసగితివి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 75

క. తాకిట తధిగిణధోమ్మని
పాకిటనృత్యంబుసల్పు భజనపరులతో
నేకీభవింప జేయుము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 76

క. రోకలిపాటగ పాడుచు
నీకథలెల్లకడలందు నిండెజగతి సు
శ్లోకుండవగుట నరవర
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 77

క. మోకయయి దివ్యఫలదపు
మాకైగన్పట్టు నిమిషమాత్రిను వ్యాహా
నీకంబు నిన్నుదలచిన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 78

క. మూకాంధక బధిరాదుల
యాకారముదాల్చితిరుగు నవఘాతయనర్ఘ
గాకాశ్యపి నీభక్తుడు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 79

క. పాత్రికారాదులతోడను
మీ కాలయ మేగుపరచి, మేలందెను భూ
లోకారాధ్యుఁడు గోపన
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 80

క. టూకీగ జెప్పెద రెండే
వాకులలో నిన్నుమించు పరదైవంబుల్
నాకంటె పాపిలేడిల
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 81

క. ఆకొన్నవానికింత మ
ధూకరమిడ డేని, యేటిదారి యక్కరకుల్
రాకున్న వేల్పు వేలుపె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 82

. కాకులుతోకలలో నెమ
లీకల జేర్చికొనినంత నే శిఖులగునా
పోకిరుల వేషగతు లివి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 83

క. ఆ కంచర్లాన్వయునిన్
బాకీకై తురకరాజు బాధలపెట్టం
బాకీలెల్లను దీర్చితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. నీకుఁ శరణాగతులను
సాకెడు బిరుదంబదేడ చనియెనొ నాపై
రాకున్నది కారుణ్యము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. రూకలగూర్చినవాఁడొక
పోకైనను గొంచుజనునె పుణ్యము పాపం
బేకద వెన్నంటెడునది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. మీకుం గుడి గోపురములు
ప్రాకారంబులును గట్టి ద్రవ్యముగలదే
సాకుము మ్రొక్కులు గైకొని
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

నాకడ లేదొక పుచ్చిన
పోకైనను మీకు దివ్యపుం క్షేత్రంబుల్
నేకరణి గాంచగలుగు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 88

ఆకుల దుంపల మెక్కుచు
తేకువ దపమాచరించు దివ్యమునులె యా
లోకింపలేరు నిన్నిల
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 89

నీ కార్యం బాకోతుల
మూకలె నెరవేర్చె నేరుపుంగల నీచే
కాకున్నె యెట్టిపనియును
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 90

ఈ కలియుగకాలమున నా
నాకష్టములందనీక నను దయతో సౌ
ఖ్యాకర బ్రోవగవలెజుమి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 91

క. ఆ కంచర్లాన్వయునిఁ
బాకీకై తురకరాజు బాధలపెట్టం
బాకీలెల్లను దీర్చితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. నీకుఁ శరణాగతులను
సాకెడు బిరుదంబదేడ చనియెనొ నాపై
రాకున్నది కారుణ్యము
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. రూకలగూర్చినవాఁడొక
పోకైనను గొంచుజనునె పుణ్యము పాపం
బేకద వెన్నంటెడునది
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. మీకుం గుడి గోపురములు
ప్రాకారంబులును గట్ట ద్రవ్యముగల దే
సాకుము మ్రొక్కులు గైకొని
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. నాకడ లేదొక పుచ్చిన
పోకైనను మీకు దివ్యపుం క్షేత్రంబుల్
నేకరణి గాంచగల్గుదు
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 88

క. ఆకుల దుంపల మెక్కుచు
తేకువ దపమాచరించు దివ్యమునులె యా
లోకింపలేరు నిన్నిల
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 89

క. నీ కార్యం బాకోతుల
మూకలె నెరవేర్చె నేరుపుంగల నీచే
కాకున్న యెట్టిపనియును
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 90

క. ఈ కఱవుకాలమున నా
నాకష్టములందనీక నను దయతో సౌ
ఖ్యాకర బ్రోవగవలెజుమి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 91

క. చీకునివలె నీ మాయా
నీకములోమునిగి తెరవునేగన లేకన్
నీకు గ్రమోడ్పితింజుమి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. ఊకనుదంచిన నందుల
నూకలుగనపడు నె యొందునుం జిల్లర జే
జేక్రై మోడ్పులులాభమె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. బాకులపోటుల కల్ల
తుపాకీలకు భయముపడు నె భక్తుకు దా
నిర్వ్యాకులుడై తేజముగను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. లోకజ్ఞానము గలిగిన
ప్రాకటవిజ్ఞానమదియు పట్టువడు నే యస్తో
కమగుభక్తిలేకను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా.

క. లౌకికుడు దన్నుదాన వి
వేకంబున మెచ్చుకొనుచు విహరించును మో
హాకరమగు గతిగానక
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 96

క. నాకవిత పద్దెములనే
మీకొక పూదండగాగ మెడనిడితిదయన్
జేకొని కోర్కెలొసంగవె
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 97

క. నేకౌండిన్యస గోత్రుడ
ప్రాకటముగ నబ్బరాజు వంశజుడను నే
నీకాప్తుడ పిచ్చయ్యను
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 98

క. మీకారుణ్యముచే నిది
జోకప్రమోదూతయందు సురచిర లీలన్
నీకర్పణ గావించితి
శ్రీకర భద్రాద్రిధామ సీతారామా. 99

క. భూకన్యాధిప మంగళ
మాకరినుత మంగళంబు భాస్కరకుల శో
భాకర మంగళమిదెగొను
శ్రీకరభద్రాద్రిధామ సీతారామా. 100



